# బాల వ్యాకరణం

# సంధి పరిచ్ఛేదం

## మగాగమ – ప్రాతాది సంధులు

ఉపన్యాసకుడు

డా.రామక పాండురంగ శర్మ

# ఘర్తు తెచ్చుకొండి ..

- ద్రుతప్రకృతికముమీఁదిపరుషములకు సరళము లగు. (సంధి.ప. 16)
  - ✓ పూచెను + కలువలు = పూచెను గలువలు
- ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు. (సంధి.ప. 17)
  - ✓ పూచెను గలువలు, పూచెం గలువలు , పూచెఁ గలువలు, పూచెన్గలువలు
- ద్రుతంబులకు సరళస్థిరంబులు పరంబులగునపుడు లోప సంశ్లేషలు విభాషలగు. (సంధి.ప. 18)
  - ✓ వచ్చెను గోవులు, వచ్చె గోవులు, వచ్చెన్గోవులు,

# నుగాగమం ...

ఉదంతానికి పరంగా

* చేయు+అతడు = చేయునతడు
* రాజు + ఆజ్ఞ = రాజునాజ్ఞ
* సొగసు + తనము = సొగసుందనము

లుప్త శేషానికి పరంగా

* పది + తొమ్మిది = పందొమ్మిది
* క్రొత్త + గండి = క్రొగ్గండి

# నుగాగమం

33. ఉదంతమగు తద్ధర్మార్థవిశేషణమున
కచ్చు పర మగునపుడు నుగాగమం బగు.

చేయు + అతఁడు = చేయునతఁడు,

చేసెడు + అతఁడు = చేసెడునతఁడు.

# ముగాగమం - షష్ఠీ సమాస

34. షష్ఠీ సమాసమునం దుకారఋకారంబుల కచ్చు పరం బగునప్పుడు ముగాగమం బగు.

రాజు యొక్క ఆజ్ఞ > రాజు + ఆజ్ఞ = రాజునాజ్ఞ,

విధాతృయొక్క ఆనతి > విధాతృ+ ఆజ్ఞ = విధాతృనానతి.

---

(విధాతృ, ధాతృ, దాతృ, మాంధాతృ, సవితృ, నేతృ )

# ముగాగమం – తనము

35. ఉదంత స్త్రీ సమంబులకును బుంపులకు నదంతగుణ
వాచకంబులకుఁ దనంబు పరం బగునపుడు ముగాగమం బగు.

సొగసు + తనము = సొగసుందనము, సొగసుఁదనము, సొగసుద్దనము

సరసపు +తనము = సరసపుందనము, సరసపుఁదనము, సరసపుద్దనము
తెల్ల +తనము = తెల్లందనము, తెల్లఁదనము, తెల్లద్దనము

ఆదేశ సరళములకు ముందున్న ద్రుతమునకు బిందు సంశ్లేషలు విభాషనగు. (సంధి.ప. 17)

ద్రుతంబులకు సరళస్థిరంబులు పరంబులగునప్పుడు లోప సంశ్లేషలు విభాషలగు. (సంధి.ప. 18)

# ప్రాతాది సంధి

36. సమాసంబునం బ్రాఁతాదుల తొలియచ్చుమీఁది

వర్ణంబుల కెల్ల లోపంబు బహుళంబుగానగు.

ప్రాఁత + ఇల్లు = ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు

లేఁత + దూడ = లేదూడ, లేఁతదూడ

పూవు + రెమ్మ = పూరెమ్మ, పూవురెమ్మ

(మీఁగడ; క్రొత్త కుండలు; ప్రాయిల్లు/ప్రాఁతయిల్లు/ క్రీ గాలు

# నుగాగమం

37. లుప్తశేషంబునకుం బరుషములు పరములగునపుడు నుగాగమంబగు.

ప్రాంత + కెంపు = ప్రాఁగెంపు;

లేఁత + కొమ్మ = లేఁగొమ్మ ;

పూవు + తోఁట = పూఁదోఁట;

మీఁదు + కడ = మీఁగడ;

కెంపు + తామర = కెందామర,

చెన్ను + తావ = చెందోవ.

చెన్ను శబ్దము వృత్తిని శోణార్థకంబు.

బహుళ గ్రహణముచే మీఁదు ప్రభృతులందు నిట లోపంబు నిత్యంబు.

వ్యవస్థిత విభాషచే నీద్రుతంబునకు సంశ్లేషంబు లేదు.

# ముగాగమం

38. క్రొత్త శబ్దమున కాద్యక్షరశేషంబునకుం గొన్నియెడల ముగాగమంబును గొన్నియెడల మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు.

క్రొత్త + చాయ = క్రొంజాయ
క్రొత్త + చెమట = క్రొంజెమట
క్రొత్త + పసిఁడి = క్రొంబసిఁడి.

క్రొత్త + కారు = క్రొక్కారు

క్రొత్త + తావి = క్రొత్తావి.

# ముగాగమం

పరుషేతరంబులు పరంబు లగునపుడు ముగాగమప్రాప్తి లేమింజేసి వానికి ద్విత్వం బగు.

క్రొత్త + గండి = క్రొగ్గండి

క్రొత్త + నన = క్రొన్నన

క్రొత్త + మావి= క్రొమ్మావి.

కెంధూళి, కెంజడ లని ప్రయోగంబులు కానంబడియెడి.

బహుళ గ్రహణముచేత

- క్రొత్తకుండ ల్విత్యాదుల లోపంబు లేదు.
- క్రిఁగడుపు, క్రిఁ గాలు, క్రిఁదొడ ఇత్యాదులఁ గ్రిందుశబ్దమునకు లుప్త శేషంబునకు దీర్ఘంబు బహుళ గ్రహణముచేతనని యెఱుంగునది.

# ముగాగమం

39. అన్యంబులకు సహిత మిక్కార్యంబులు
కొండొకచోఁగానంబడియెడి.

ఒకానొక శబ్దంబున కొకానొక శబ్దము పరంబగునపుడు
తొంటి యట్లు లోపనుగాగమంబులు గొండొక శబ్దమున
కొకానొక శబ్దము పరంబగునపుడు లోపద్విత్వంబులును
బ్రయోగంబులందు జూపట్టెడునని తాత్పర్యము.

# ముగాగమం

పది + తొమ్మిది = పందొమ్మిది;
తొమ్మిది + పది = తొంబది;
వంక + చెఱఁగు = వంజెఱఁగు;
సగము కోరు = సంగోరు;
నిండు + వెఱ = నివ్వెఱ;
నిండు+ వెఱఁగు = నివ్వెఱఁగు;

నెఱు + తఱి = నెత్తఱి;
నెఱ + నడుము= నెన్నడుము;
నెఱ + మది = నెమ్మది;
నెఱ + వడి = నెవ్వడి.
ఇత్యాదులు ప్రయోగంబుల వలనం దెలియునది

| | |
|---|---|
| ఉదంత తద్ధర్మార్థకానికి | * చేయు + అతడు = చేయునతడు |
| షష్ఠీ సమాస ఉ/ఋ లకు | * రాజ + ఆజ్ఞ = రాజనాజ్ఞ<br>* విధాతృ + ఆనతి = విధాతృనానతి |
| తనము పరమైతే | * సొగసు + తనము = సొగసుందనము/సొగసున్దనము/సొగసుఁదనము<br>* తెల్ల + తనము = తెల్లందనము/ తెల్లన్దనము/ తెల్లఁదనము |
| లుప్త శేషాలకు పరుషాలు పరమైతే | * మీఁదు+కడ = మీఁగడ |
| క్రొ..'న్/ద్విత్వం' | * క్రొత్త + చాయ = క్రొంజాయ<br>* క్రొత్త + మావి = క్రొమ్మావి |

